# Sthava Rajam.

A DEVOTIONAL TREATISE

IN

Telugu Verse.



RAJAH M. BHUJANGA RAO,

EASTER, 1920

CHANDRIKA PRESS, GUNTUR

# PREFACE.

This is a little book that can very well be used for individual devotional purposes. Appreciable traits of all Godly qualifications and human wants find a place in it. In daily life whenever a man feels disgusted with the daily professional turmoils, he will derive much strength and peace of mind if he will read a few stanzas with understanding. A perusal of a few verses will certainly raise the reader from the Human plane to that of Divine.

I wrote this book in the month of September 1918. Then I was obliged to spend a month in Mr. K. Kanniah Chetty's Choultry in Tondiarpet, Madras, when I placed my eldest daughter as an inpatient in Mission Rainy Zenana Hospital for an abdominal operation.

The style of the book, is, no doubt, a little elivated, but it can easily be mastered. No devotional ecstasy can be reached in the ordinary language of the dialogue, and good musical rythem also cannot be obtained.

My labour will amply be repaid if it brings joy to atleaast a few souls that are yearning after God. I send this to my friends as an Easter remembrance.

Guntur,
25th March 1920. }

RAJAH M. BHUJANGA ROW.

# స్తవరాజము.



మ॥ తనివుల్ దీరని భక్తియుక్తి జగదాధారున్ మనోమందిరం
బున నిచ్చల్ నివసింపఁ జేయు నురు నైపుణ్యంబు పుణ్యంబునం
గనుచో నైహిక వాంఛ దీరు టొక దుర్గంబౌనె? నీ దివ్య పా
వన కారుణ్య కటాక్ష వీక్షల నలభ్యం బెద్ది? యేసుప్రభూ॥

మ॥ జలభాగంబున బుద్బుదంబు లెటు లాశ్చర్యంబుగాఁ బుట్టి యా
సలిలాంతంబున నుత్తరక్షణమున న్నాశ ల్లయం బందు; భూ
స్థలి జీవాత్మలు నట్లె పుట్టి సమయున్; ధర్మం బదే; యైనచో
నిలపైఁ గష్ట సుఖానుభూతికి ఫలం బేమౌనో? యేసుప్రభూ॥

మ॥ జననం బాదిగ మృత్యువర్తి గత దుష్కాలంబు సంప్రాప్తమౌ
దనుకన్ శ్లేష్మములోని యాఁగ గతి సంతాపంబునన్ గ్రుగ్గు జీ
వున కీ జన్మ ఫలంబు యూమ్మ దమలీభూతోక్తులాచారమం
దౌనర స్నిల్పుటయేకదా! తెలుపు మార్గోత్తంస! యేసుప్రభూ॥

మ॥ ధరణి స్నీదయ లేనివారలు నిరాధారుల్, తృణం బైన ని
ల్వరు సంసార తరంగ జృంభణను; భీభత్సంబుగా కేమగుం;
బరితాపానల తప్త మానవ తనువ్యాపార మగ్నాత్ముల
నిరులం బాపభరంబునుండి కరుణం గాపాడు మేసుప్రభూ॥

మ॥ తృణమైన వృషజాల మీభువి భవత్సంకల్ప కార్యంబుగా;
గణియింప స్రచియింపజాలము మహాత్కార్యంబులన్ ధాత్రిపై;
నణుమాత్రంబును మాయధీనములు గా వాధ్యాత్మికావస్థ; లో
ప్రణుతానేకమహాజ్ఞనాఘ! యనుకంపస్వాంత! యేసుప్రభూ॥

మ॥ కృత పాపౌఘ జనాళిఁ బ్రోచుటకయి ధాత్రిన్నీవు చెల్లప్పు స
ద్వృత్తి మైయుంట స్వభావజన్యమయి ధైర్యస్థైర్యము ల్గొల్పగా
వెతలం జెందుచు నిల్వనై మడిసి యావిర్భూత దివ్యస్వరూ
ప, తనూ వైభవమంది మాదృశులఁ బ్రోవన్నెంచు నేసుప్రభూ॥

మ॥ ఘటికాయంత్రము కీలుఁ ద్రిప్పి విడువం గాలంబు సూచించియా
చట (గీల్ద్రిప్పునిచో నిలంబడః గతిన్ ధాత్రీజనం బెప్డు నీ
పటుకారుణ్య కటాక్ష లేశ గుణ సంప్రాప్తిం జరించున్ ధరం
జటులప్రాభవ లోక రక్షణ సదాచారాఢ్య యేసు ప్రభూ॥

మ॥ కడు సాన్నిధ్యమునందు (గల్గు భవదాకారంబు నీక్షింపకే
పుడమి న్మానవు లన్యమార్గములకుం బోఁజాలు రిట్లేకదా!
వడిగా బారు ప్రవాహము న్విడిచి పోవంగా (బిపాసార్తు లా
నడుమ న్నిలుచు మరీచికల్ గనెదరో న్యాయాత్మ! యేసు ప్రభూ॥

శా॥ గగనాంత ప్రచర త్ఖగాళి భువి నంగోయ చందంబునన్
జగదంతస్థిత జీవలోకము పరేచ్ఛం బొంది యుండుం గదా!
భగవత్పాద కథా సుధారసము నాస్వాదించు భాగ్యంబు మా
కోగి సంధానము జేయు మీశ్వరసుతా! యో క్రీస్తు యేసు ప్రభూ

మ॥ ధర సంతానము మారుత్రోవల జనన్ దాక్షిణ్యతం దండ్రు లా
దర మొప్పం దమ సంతతి న్మనుప సాధ్యంబౌనుపాయంబుల
న్నిరతింజేయుదు రట్లె దైవము ధరన్నిల్పి నీ సిల్వచే
నరయన్ లోకము నుద్ధరించె గృపచే నాశ్చర్య మేసు ప్రభూ॥ 10

మ॥ నరజన్మంబునొసంగ నేల, బిదపన్ సౌఖ్యాప సౌఖ్యప్రదు
ర్ధరమార్గంబుల ద్రోయ నేల యనుచున్ బ్రశ్నించినన్ దేశికుల్,
వరధాత్రీగుల నే భయావహ నయప్రాప్తిన్ స్వతుల్యాధ్యులై
వరలం జేయుదు రట్లె నీవుననుచున్ భావింతు నేసు ప్రభూ॥ 11

మ॥ ధరవేదాంతములెన్నొ యుద్భవములై దైవస్వరూపంబు రూ
పరఁజేయ న్నరులాప్రపఁగములపై సాధారముంగొంచు ని
న్నరయన్నీరక సద్ధగృహంబులగుచున్ వ్యామోహమునంగందు కి
దురవస్థం దొలఁగించి పాపము ప్రజాదుఃఖంబు నేసు ప్రభూ॥ 12

మ॥ కలిగన్ మానవజన్మ కారణము లేకాలంబునన్ గోచరం
బులు గావేరికిఁదత్త్వప్రకిజముల్ పోనేల? పోఁజూచినన్
ఫలమున్ శూన్యము; గాన జన్మతరియించంజాలు మార్గంబు ని
మ్ముల జూపింపుము జ్యేష్ఠసోదర! కృతామోఘార్థ! యేసు ప్రభూ॥ 13

మ॥ తృణమైనన్ పరితాపశూన్యముగ యోమ్మత్సేవ గావింప మా
కణుమాత్రంబున వీలుకల్గదు; పృథు వ్యాపార సాంసారిక
ల్బణ భారంబున మున్గి తేలుదుము; పాల న్విస్తృత హస్తాబ్జ ఘ
ర్షణ యుక్తాంజలి జేసెదం దనివిదీరం గ్రీస్తు యేసు ప్రభూ॥ 14

మ॥ కలభారంబఖిలంబు నీవ …ని సాఫల్యంబుగా వైచి ని
శ్చలచిత్తంబున నమ్మువారికి ఫలోత్సాహంబులం గూర్తు వం
దలి సత్యంబు గ్రహింపలేక పరితప్తస్వాంతులై కుందు వా
రల దౌర్భాగ్యము వాపి ప్రోవుమలరారం గ్రీస్తు యేసు ప్రభూ॥ 15

మ మరియా! యెంతటి పుణ్యశీలవో కదా! మా యీ జగద్రక్షకుం
దరయ న్నీయుదరంబునుండి యిలపై నావిర్భవించెన్; సహో
దరుఁడౌటం దయచేసె మాకిట సమాధానంబు నట్లౌట? నే
ను రహిన్ వ్యక్తముగా నుతించెదను నిన్నుం దల్లి నేసు ప్రభూ। 16

మ॥ నిను నాత్మ న్నెరనమ్మువారి కిల సాన్నిధ్యంబునందుందువం
చును వ్యాకుల్పతి వాట భీతి నలదంచు న్నిశ్చలాత్ముండనై
తిని నాకున్ స్థిరబుద్ధి యెల్లపుడు స్వాధీనంబు నందుండు భా
గ్య నిరూఢిం గలిగింపుమ… ప్పా! దయ నోయ్యం గ్రీస్తు యేసు ప్రభూ॥ 17

మ॥ నవరంధ్రంబులనుండి హేయమగు దుర్నిర్మల్యమే తెంచు;సం
భవమౌచు న్విమలాయువుల్వెడలు;నెవ్వన్ రక్త మాంసాస్త్రియు
క్త విశేషార్త్రయుతంబు లీతనువు,లీధాత్రి న్విమోహా ప్రభా
వ విధానం బెటులబ్బె?దెల్పుము,స్వభావంబెద్ది? యేసు ప్రభూ॥ 18

మ॥ తనువుల్ స్థూలపదార్థ మాత్మయును సువాక్సన్ సాత్కమై యొప్పు నీ
తను దేహైక్యవిధాన మీశ్వరకృతార్థంబందురీ ద్వర్థిచే
తనుమాయామయమై జగజ్జనము సంతప్తాంతరంగంబులన్
వనటం జెందెడి;లోకరక్షణమున న్వర్తింపు మేసు ప్రభూ॥ 19

మ॥ ఇలపై జన్మమొసంగి, పెంచి, రమణీ స్వేచ్ఛా విహారక్రియల్
వెలయం జేసి, సుసంతతిం గొలిపి, యీలీలన్ సుఖంబిచ్చి,చా
వులు, దుఃఖంబుల,బాధలం బరపినీవున్మమ్ము హింసించు రీ
తుల గూఢార్థము దెల్పి ప్రోవుము కృపన్ దోర్వీర్య యేసు ప్రభూ॥ 20

మ॥ ధనమా కోరవు, కీర్తినొంద నణుమాత్రంబైన నాశింప వం
ధునిఁ బంగుం దయఁజూతు, వాత్మశుచియే తోరంబుగా నెంతు, వీ
ఘన నిష్టంపఁ దలంచువారికొఱకై శోధించి ప్రార్థింతు, వీ
ఘన నైపుణ్యము నీకుఁదక్క నితరాక్రాంతంబె? యేసు ప్రభూ॥ 24

మ॥ మృతులన్ మేలుకొనంగఁ జేసితివి; మేరీ మాగ్దలే నాఖ్య కా
వతిఘోరగ్రహబాధ మాన్పితివి; సంఖ్యాతీత రోగార్తులం
గృతకృత్యాత్ములఁజేసి తన్పితివి; సంకీర్ణాఘ కూపస్థ జీ
వతతిన్ ధీరుఁడవౌచు బ్రోచితివి; వన్నాలింపు మేసు ప్రభూ॥ 25

మ॥ జడ పాంచాలికలన్ ఖగక్రిమి మృగాశ్వద్ఘోర వృత్తంబులన్
వడిఁబూజించిన, నీటమున్గినను, సంభావించినన్ వ్యగ్రమా
బడబాగ్నిన్ శలభంబువోలెను స్వరూప స్వార్థ చిత్తంబులన్
జెడు; నీమాటల విశ్వసింపనియెడన్ జీవాత్ముఁ డేసు ప్రభూ॥ 26

మ॥ భవదాజ్ఞారహితంబుగా జనుఁడు సంపద్వ్యక్తుఁడైన న్మహీ
ధవుఁడైనన్ రచియింపనేరఁ డెదియుం దధ్యంబు శీఘ్రంబుపై
న, విరాజిల్లెడి కేశవర్ణ మెవఁడైన న్మార్ప నీలుండు నే
భవభీతిం దొలఁగించి మానవుల సంభావింపు మేసు ప్రభూ॥ 27

మ॥ ధర వైద్యాలయముల్ విశేషముగఁ ద్రవ్యాన్నమంబున న్నిర్మించి దు
ష్కరమౌ వ్యాధులమాన్పి రోగులకు హర్షంబిచ్చు చుండెం దగన్
దొరసాను ల్భువదీయ సేవకయి బంధువ్రాతము న్వీడి యీ
పరమార్థంబున సంచరించెదరు శశ్వత్కీర్తి నేసు ప్రభూ॥ 28

మ॥ ధరణిం బుట్టినదాది చచ్చుదనుకం దాపత్రయోపేత దు
ర్భర సాంసారిక బాధల న్మునిఁగి త్వత్పాదారవిందార్పనా
పరత న్వర్తిలనీలుచిక్కఁడు కృపాపారీణతం బ్రోవుమీ
వరదా! మానవకోటి నిన్ను నుతియింపం గ్రీస్తు యేసు ప్రభూ॥ 29

మ॥ ధనమే లోకుల కైహికార్థ ఫల సంధానానుకూల ప్రసా
ధనమం చందురు, వ్యర్థవాక్యమిది; సాధ్యంబయ్యెనే సాధుసం
పాదనం బర్థసమృద్ధిచే ధరణి; నాహా! దైవసంకల్పమే
ఘనమై సార్థకతం గనుం దుదఁ గడుంకన్ క్రీస్తు యేసుప్రభూ॥ 30

మ॥ వెగటైతోఁచును సాధువాక్య తతులుర్విన్ దుష్టవాక్యంబు లిం
పుగఁ గన్పట్టును, సత్పదార్థమరుచిం బుట్టించు నారోగ్య హీ
న గుణత్వాఢ్య పదార్థ మిష్టమగు; నెన్న న్లోకమాన్యంబిదే
యగుట న్నీవచనంబు లేరు వినరయ్యా క్రీస్తు యేసు ప్రభూ॥ 31

మ॥ కడు దౌర్జన్యముతోఁ బ్రజాహరణచిత్తుంబూని సైతాను మా
నడుమం జేరి సదా దురాసదము లన్యాయంబు లౌకృత్యముల్
వడిఁ జేయించుచు నిగ్రహింపదరమే వాత్సల్యపూర్ణాత్మ! నీ
పుడుపం జెల్లును వీనిదౌష్ట్యముల సాధూత్తంస యేసుప్రభూ॥ 32

మ॥ నిగుడుంగత్తుల విప్ప కట్టెఁగదుఘట్ శీఘ్రింబుగా మండు; ప
న్నగమున్ విప్పఫణంబు ఁ దెబ్బఁదినఁ; ద్వన్నామ ప్రక్షావస్వభా
వగుణంబుల్ ఖుజనా ర్తివాప్తుఁ నటులే వ్యాప్తింగమున్ ధాత్రి నో
జగదేకార్త పరాయణ వ్రత చణా! సౌమ్యాత్మ! యేసు ప్రభూ॥ 33

మ॥ ఉదయంబాదిగ నిద్రవోవుతరికన్నో దుష్కృతావస్థలన్
మదిఁ జొత్తిల్లును నిత్యకృత్యములు గమ్యస్థానముం జేర్ప నీ
సుదతీ పుత్రి ధ సేవఁ జాదు లనిశమ్ శోధంబుఁ గల్గించు నీ
పదపద్మాశ్రయులే సుఖావహము భూపా! క్రీస్తు యేసు ప్రభూ॥ 34

మ॥ తనువుల్లాడ నశాశ్వతంబు లమలోత్సాహాతి దీర్ఘుంబులా
నమరాగంబులు జాడఁ గేవలవృథాయాసంబులౌ సర్వరన్
ఘనకేదావహనుల్ వియోగములు సాంకర్యంబు లాత్మవ్యథల్
ధన ధాన్యాదిక మాయఁ జాలదిల సద్భావంబు సేను ప్రభూ॥ 35

మ॥ తరమే మానవజాతికీధరణి సంతప్తాంతరంగంబులన్
నిరతి న్నీపదసేవ ద్రిప్పుటకు సాంద్రీభూత రోగార్తులా
పరమాప్తుల్ పరితాప మందఁగ ఋణోవ్యాధుల్ పృథుక్రోధభీ
కర షాతాక్ష పరివారముల్ దరణ మార్గం బీవె యేసు ప్రభూ! ౩౬

మ॥ నిముసంబేని వ్యవధానమీయక సదానిష్కారణం బెద్దయౌ
యమబాధా సమతాప భారము విపర్యాసంబుగాఁ బొందుయో
గము ధాత్రీజన ఫాలభాగమున జక్కంజెక్కినావో యనన్
భ్రమఁజెందు న్మనమాత్మతాపముగ నన్ ఋన్నింపు మేసు ప్రభూ! ౩౭

మ॥ ఒకరారోగ్యమునంద వేరొకరు ధైర్యోత్సాహమాన్యంబుగా
వికటోద్యత్పను రోగ పీడిత తనూ వేగాత్తతాచుందు రీ
వకలంకావధ సత్త్వము ల్వాలయు సర్వాంతస్థితి న్నిండి మా
మకమా ప్రార్థన మాలకించి ప్రజలన్ మన్నింపు మేసు ప్రభూ॥ ౩౮

మ॥ తనువుల్బ్రాణ లశాశ్వతంబులు మహోధర్మంబు లీర్ష్యాకరా
యణముల్ క్రూరము లైహికార్థ ఫల కామ్యాయత్తముల్ చిత్తముల్
ధనకాంక్షా పరతంత్రముల్ మనుజ వృత్తం బిట్లు క్షీణించె నీ
జనఘోషం దొలఁగించి ప్రోవుము దయన్ స్వచ్ఛాత్మ యేసు ప్రభూ॥ 39

మ॥ పరివారంబును బాంధవుల్ సుత సుహృ ద్భార్యా ద్యనేకాప్తులున్
మరణానంతను బాపలేరిక, బరానందంబుఁ గల్పింపఁజా
లరు; వ్యర్థుల్ భువివారికై సుకృతజాలంబెల్ల ఁబోనాడి దు
ర్భర దుష్టత్వము లాచరించెదము జేరంజేసు మేసు ప్రభూ॥ 40

మ॥ విమలాంతఃకరణంబుఁ గూర్చి సకలోర్వీభంగ మోహానుబం
ధములం ద్రెంచి మదీయపాపచయముం దప్పించి రక్షించు భా
రము నీదేగద! నీయధీన మధిపా! ప్రాపంచికవ్యాప్తముల్
క్రమరీతి న్నడిపించి మించుము కృపాలంకార! యేసు ప్రభూ॥ 41

మ॥ ధనమేమౌనో ? సతీసుతాదులిఁకమీఁదం దానినేరీతిగా
వినియోగింతురో ? నాయుఃకంతరము , దోర్వీర్యంబు నిర్వీర్యమై
చనె వృద్ధత్వమునంగదా ; యనిజనుల్ సంతప్తులై యెల్ల నీ
ఘన శిక్షా విధి గోచరింపమిని నిక్కం చేలు మేసు ప్రభూ ? 54

మ॥ ధరణిన్ జన్మము నెత్తునప్డుఁ బిదపం దజ్జన్మకృత్యంబు లా
దర మొప్పన్ రచియించునప్డుఁ దుదకంతంబందు నట్టైన మా
కరయన్ స్వేచ్ఛ యొకింత లేదుగద ! భూమ్యాకాశమధ్యంబునం;
బరిపాలింపుము కిల్బిషంబు వెడబాపం జాలు దేస్తు ప్రభూ ! 55

మ॥ పణమా నిత్యముగాదు, బంధుజనమున్ వ్యర్థంబె, యా తత్తర
క్షణమైన న్మనుజాడఁ గానవుఁగదా ! కామ్యాంబు లెల్లన్ వృథా;
మణిమంత్రౌషధసాధనంబులవి ఛద్మప్రాయమెంచన్; భవ
ద్ఘృణమే మోక్షమొసంగుఁ గష్టదశలుర్విం బాపు సేను ప్రభూ ! 56

మ॥ సుతదారాధనకాంతులం బ్రజలు సంక్షోభించి రాత్మవ్యథా
యుతులై, సౌఖ్యము బుద్బుదాత్మకము, యీ యాగాయముల్ జన్మముల్
సతతంబున్ క్షణభంగ దేహములకై యంబుం బోనాడు వా
రతిహీను లమతిహీను లజ్ఞులు ఖలవ్యా రు లేసు ప్రభూ ! 57

మ॥ పరమాత్మా ! కరుణాలవాల ! వరదా ! పాపించిక స్వప్రజో
ద్ధరణపాపభవ దుష్టభూతకృత సాంద్రాంధోత్మకంబైన యీ
నరకోపన్య ధరాతలస్థ భవసంజాత ప్రదుఃఖంబులం
గరుణంబాపి మహోపకారకలన రక్షింపు మేసు ప్రభూ ! 58

మ॥ వటవృక్షంబు సహస్రవర్షములు దావర్ధిల్లు నీభూస్థలిం,
బటుధుర్యుండగు మానవుండు క్షణమైనన్ జీవితస్థైర్యమం
దుట కాధారములేదు పాపియగుటన్ దుఃఖాకులస్వాంతులం
గొందై ఖేదము చుండు దయం బోషించెల్లు నేసు ప్రభూ 59

మ॥ బ్రతుకే నిత్యము కాని యీ ధరణిపై బంధువ్రజం బా స్త్రీయున్
సతులున్ బిడ్డలు సత్యమెట్లగుదు రాశల్ వ్యర్థముల్ వారికై
యతికాంక్షాపరతన్ మెలంగుట వృథాయాసంబు ; నిత్యంబుని
ష్కృతిఁ బూజించిన సత్యమౌ ఫలము దానంగల్గు నేను ప్రభూ ! 60

మ॥ సతికో సంతతికో సహోదరులకో సంబంధులం దేకో
యతిపాశ్రయబాధగల్గుచు మనోవ్యాధిన్ సదా గొల్పునీ
గతి రక్ష్యాంతరణంగ లౌకికపరాగ్రస్థమౌ మానసం
బు; తదీయార్తి హరించి పోషింపఁదగు మమ్ముం గ్రీస్తు తేము ప్రభూ ! 61

మ॥ పరిపాలింపుము లోకబాంధవుఁడ వా ప్రశ్రేణియా మానవో
త్కర పాపాదిల బాధలం దొలఁచి స్వర్గప్రాప్తి గల్గింపు ము
ద్ధుర దౌర్జన్య ఘనాపరాధ పరు కృత్యుల్ మానవు ల్వారి దు
ర్భర సంకీర్ణ రుజాదిబాధలఁ దరింపం జేయుము మేను ప్రభూ ! 62

మ॥ కలదే సత్త్వమునీవు లోకులనుపాకన్ సిల్వపైఁజచ్చిపో
వలసైతానుని మృత్యువున్ గెలిచి పూర్ణాత్మం బునర్జీవమున్
బలిమింగొంటివి ; వైరి మమ్ము వెతల న్వంచించుచుండెన్ భరిం
పలవంబేని శమంబుఁగాన మనుకంపంబొప్పు మేసు ప్రభూ ! 66

మ॥ ఫణిరూపంబుధరించి నాఁడు, జనులం బాపాత్ములం జేసిదా
రుణ దుర్మార్గములందుఁ ద్రొన్చి మిగులన్ రోగార్తులం జేసినా
డణిమాద్యష్టఫలంబులంగలిగి భూతాకారముం దాల్చు నా
గుణహీనుంబరిమార్చి లోకసుఖముం గూర్పింపు మేసు ప్రభూ ! 67

మ॥ వెతలం బాపుము, నిన్ను బోలుప్రభునీపృధ్విం గనంజాల, సం
చిత పాపంబుల నూపుమావి మమురక్షింపందగున్ ధాత్రిస
మ్మత మే నీకువిరోధికృత్యములు కుంభల్లీలమైవర్ధిలన్
హితనీభృత్యులు దుర్గతింబొగిలి గాసింజెంద నేసు ప్రభూ ! 68

మ॥ అవధానంబున నుంచుకాలమున నీయాజ్ఞల్ మనోవీధియం
దు విజృంభింపవు కష్టకాలముల సందుండోచు నక్లోటచే
భవబాధంబులువాయ నేరవు వృధావ్యాసంగములాని నే
భవపీఠోరుపదాంబుజద్వయము నే భావింతు నేసు ప్రభూ! ౬౯

మ॥ గ్రహబాధల్ దొలఁగించితీవు విపులోగ్రవ్యాసు లెన్నేని ని
గ్రహశక్తిన్ వెడలించితీవు మృతులం గాంచుం బునర్జీవులన్
రహిఁగావించితివీవు పృథ్విఁ నరజన్మన్మించు కాలంబునన్
బహుబాధల్గనుమమ్ముఁ బ్రోవుమనుకంపం గ్రీస్తు యేసు ప్రభూ! 70

మ॥ అతిపాపాత్ముఁడ పాపసంభవుఁడ సంఖ్యాతీత ఘోరాఘ సం
గతి దైనందిన వర్తనుండ నవనిన్ గర్వాంధుఁడ దాసానుదా
సతతిం జేర నవర్హుఁడం గరుణసాక్షాత్కసంధాయివై
గతిఁగల్గింపుము నాకు దేవతనయా! త్రాణకర్త! యేసు ప్రభూ 71

మ॥ అథయాత్మజ దినచర్యలన్న దుపునష్టారతుఁ బండొజగ
త్ప్రభు వేరీతిఁ దలంచునో యటులొనర్పఁ సిద్ధమైయుండినన్
శుభముల్ చేకుర నిందునందు మనకున్ దుఃఖంబులుం బాయు, స్వా
నుభవంబీవిధి సల్పి మమ్ముఁ గడు నెందుం బ్రోవు మేసు ప్రభూ! 78

మ॥ జ్వరరోగార్తులఁ ద్వత్సహోదరుల దౌర్బల్యంబులం ద్రుంచి భీ
కర దుర్ధాంతి రుజాపనోద మిపుడుం గావింపు పూర్వంబటుల్
నరులెంచన్ బలహీను లీవెగద! యస్వాస్థ్యంబులం బాపు నే
ర్పరి వట్లాటను మమ్ముఁ బ్రోవు మధవా! రారాజ ! యేసు ప్రభూ॥ 79

మ॥ ఒక వేళన్ సుఖసంచయంబు మురువయి యొప్పారుచున్నట్లు వే
రొక వేళం బెనుబాములాదుకొని శైర్యోత్సాహముల్ గ్రుంగుపో
లికఁ గన్పట్టును బండికల్లనఁబవల్ లేయుంగవన్ సౌఖ్యదుం
ఖ కరావస్థలు తారుమారగును దుఃఖంబార్పు మేసు ప్రభూ! 80

మ॥ పరమార్థప్రాప్త పదార్థసంగ్రహణ తత్త్వజ్ఞానసంపాదన
త్వరతన్ జ్ఞానవశోజి వర్తిలును; సంభావించు మార్గంబు తే
ధరణిం జెప్పఁ దిరంగునై పరఁగు; నీ ధర్మోక్తులే సర్వదా
స్మరణీయంబులు మోక్షదాయకము లోసర్వేశ యేసుప్రభూ! ౮౧

మ॥ జగతి న్యాయవు లాచరింపఁగ భవత్సంకల్పితార్థంబులన్
దిగవాడ న్మదినెంతు నైహికములన్ దేదీప్యమానప్రభా
వ గభీరంబగు స్వర్గవైభవము సంప్రాప్తించుచో నందుచేఁ
దగ గూఢంబొనరించి యుందువనుచుం దర్కింతు నేసుప్రభూ! ౮౨

మ॥ ప్రతికార్యంబును జేయఁబోవు నెడ ధైర్యంబూని సర్వేశుఁ డే
గతి దాని ప్రసాదించునో యని వితర్కంబూని తద్రీతి స
న్మతిఁ జేయ! స్వమకట్టువారలకు హస్తన్యస్తమై శ్రేయముల్
సతతంబుం బరిచర్య చేయునుగదా! సత్యాత్మ యేసుప్రభూ! ౮౩

మ॥ ఘనకార్యాచరణంబు వ్యర్థము, మహాకీర్తి ఖ్యాతియుక్ రిత్తయా
ధనధాన్యాదికముల్ వృథా, సుత సుహృద్దారాదులుం గల్లయా
గుణసంపూర్ణుఁడవైన నీకరుణ మాకుం గూర్పఁగా కన్యసా
ధనముల్ గూర్పఁగ లేవు నీ వర సమాధానంబు నేసుప్రభూ! 87

మ॥ మతము ల్లెక్కకు మిక్కుటంబులుగ ధీమంతుల్ ప్రబోధించి, దై
వత సాక్షాత్కృతిజేయునంద్రు; పరికింపన్ నీవలెన్ స్వోత్తలం
గృతకృత్యంబులఁ జేసి రెవ్వరు? ధరిత్రిన్; గాన నిన్నే మదిం
బరితిమర్త్యుండు నిదానవృత్తిఁ గనినన్ ధన్యాత్ముఁ డేసుప్రభూ! 88

మ॥ ఘన విశ్వాసమె మూలకారణము లోకవ్యాప్త తత్త్వాళిచే
జననంబౌ మతకోటి కెల్లఁ; గడు సౌజన్యంబు దీపించు క్రీ
స్తునిపై విశ్వసనంబు గూర్చిన మహాత్ముల్ ధన్యు; లాతండు చె
ప్పినరీతిం బచరించు; నీవిధము వ్యాప్తిం దుము నేసుప్రభూ! 89

మ॥ జననంబున్ మరణంబు శోకమున నిర్బంధాంతస్థితుల్ భూస్థలిన్;
ఘన శోకాతురపాల దుఃఖ భాజనములై ప్రాణుల్; యథేచ్ఛావిధిం
గన సాహ్లాదకరంబుగా; నటులఁ జక్రం బేసి, లోకార్తి వా
పిన, నీపుణ్య మగణ్యమై నెగడు, దీప్తిం గ్రీస్తు యేసుప్రభూ! 90

మ॥ దివిజాధీశుఁడు సృష్టికర్త పితయై దీపించు మర్త్యాళి భూ
ధవు లన్నన్ భయ మేమి? ధర్మపరతంత్రప్రక్రియన్ సర్వదా
జపసత్యంబుల వద్వితీయు లయి విశ్వాసంబునన్ వర్తిలన్
భవ బంధంబులఁ బాపి ప్రోచును గదా! భక్తాళి నేసుప్రభూ! 91

మ॥ జన సామాన్యము సౌఖ్యమందు విపుల న్నల్పంగ సాహ్లాద భా
జనమై స్వీయ సుఖానుభూతి కనువా చందంబు సందిల్లు; నం
చన శేయుఁజ సమకట్టు దుర్భర పిశాచ క్రూరతాఘంబు లా
ర్తిని గూర్పున్ వినిగూఢ వృత్తి సతమున్! క్రీస్తు యేసుప్రభూ! 92

మ॥ నిరతి న్మానవ సేవ సల్పుటే ప్రభూ! నీనిత్య సేవాకృతిన్
వరలున్; మానవ హింస, నీ యపకృతింగావించి వట్టే యడున్
వర దేవాత్మజుఁ డంచు ని న్నిలుచుటన్ న్యాయ్యంబు తా నిగతిన్
భరమౌ కిల్బిష సాగరంబు దరియానాన్యాంచింతు నేను ప్రభూ! ౯౩

మ॥ ధర పాపాత్ముఁడ, పాప సంభవుఁడ నాథా! పాపకర్ముండ, దు
ర్భర పాపానల దగ్ధ గాత్రుఁడ, కృపాపారీణ సంభావ్యభా
స్వర దృగ్జాలము నాపయిం బరపి, నిర్వ్యాజంబుగాఁ బ్రోవు మో
నరనారాయణమూర్తి; రక్షక! విరావం గ్రీస్తు యేసు ప్రభూ! ౯౪

మ॥ వరుఁడౌ దేవుని విగ్రహంబు; విమలాంతర్వర్తి తత్త్వము; మా
ర్గవర్తి నట్లియ్యను పాపభారమును దౌర్భాగ్యత్వమును గాంచుటల్
పరితాపావహ మౌ; భవవ్యథల సంప్రాప్తాత్తి గ్రోత్ర గాఁ
దిరమై మించెఁ బురాతన ప్రతిభ సూక్తిన్ మించి యేసు ప్రభూ! ౯౫

మ॥ సతతంబుగ బహిరంగ సీమ నెమకన్ సంప్రాప్త మెల్లొను? దై
వత మాత్మీయత, నాంతరంగికముగా వర్తిల్ల; స్వార్థంబు నే
గతి నైనన్ దిగఁ ద్రోసి విశ్వవినుత ఖ్యాతి న్వాదంబించి జీ
విత లాభంబును జీవకోటి గను దృష్టిం గ్రీస్తు యేసుప్రభూ! 96

మ॥ క్రమలీలన్ భువి పాపపుణ్యములు నీరక్షీర సామ్యంబునన్
భ్రమ గల్గించి మహాపరాధములకుం బాల్సేయ నుద్యుక్త మా
నవ లాంతఃకరణంబు లంచల గతిన్ భేదించి సత్యంబు నే
తమి స్వాయత్తము జేసికొందు రెపుడున్ ధన్యాత్మ! యేసుప్రభూ! 97

మ॥ సరళంబౌ ముకురంబునం గనినచో సవ్యాపసవ్య స్థితుల్
విరసంబై గనుపట్టు నైహికము లీలీలం బ్రవర్తించు, నీ
పరమ ధ్యాన విశుద్ధ దర్పణమునన్ భవ్యంపు టాముష్మిక
స్థిర సౌఖ్యంబులు గానవచ్చు; నది మేల్గొందించు యేసుప్రభూ! 98

మ॥ ఘన కాసారమునందు బింబ శశిబాలం గాన్పించు వ్యక్త స్వహా
మను జాంతఃకరణంబులం బ్రభుని సౌమ్యం బైన రూపంబు దు
ర్గుణ భేద స్థితిచేఁ జెలంగు నని ధీయుల్ నమ్మి శుద్ధాత్ము లై
నిను సేవింతురు గాన వారిఁ గనుమా నిత్యంబు నేను ప్రభూ!

మ॥ వర మంత్రి ప్రెగడ డాన్వయోద్భవుఁడ, సద్భక్తిన్ భుజంగాఖ్యుఁడన్
ధర పేలాపుర వాసుఁడం బటు మతాంతర్వర్తియై యొప్ప సం
బర లోకప్రభు సేవ సల్పు నరుఁడన్, మత్తేభ విక్రీడితా
కర వృత్తంబుల మాలఁ గూర్చితి, వడిం గైకొమ్మ! యేసుప్రభూ! ౧౦౦

సంపూర్ణము.



